శ్రీ ర స్తు.

# శ్రీకృష్ణ భారతము.

## భావార్థ దీపిక.

---

ఆదిపర్వము — ప్రథమాశ్వాసము.

శ్రీకృష్ణుఁడు భారతమునకుఁ బ్రధానుఁ డగుటంజేసి శ్రీకృష్ణ భారత మనియు, వ్యాసభగవానునికి శ్రీకృష్ణుఁడని పేరుగలదు. ఆతఁడు రచించినదగుటంజేసి శ్రీకృష్ణభారత మనియు, శ్రీపాదకృష్ణ కృతంబగుటంజేసి శ్రీకృష్ణభారత మనియు, దీనిపేరు సార్థకమగు చున్నది. భారతమనఁగా బరువైనది. ఆదికాలమున దేవతలు నాలుగు వేదములను ద్రాసులో నొకప్రక్కను భారతము మఱియొకప్రక్కను బెట్టి తూఁపఁగా భారతముగలప్రక్క భార మెక్కువగుటంజేసి లేవకుండె ననియు నద్దాన దానికి భారత మని పేరు వచ్చిన దనియుం జెప్పుదురు.

"శ్లో॥ నారాయణం నమస్కృత్య నరం చైవ నరోత్తమమ్।
దేవీంసరస్వతీం చైవ తతో జయ ముదీరయేత్॥"

ఇది భిన్నదేశప్రతులందు "దేవీసరస్వతీం వ్యాసః" అనియు, "దేవీం సరస్వతీం వ్యాసం" అనియు, "దేవీసరస్వతీం చైవ" అనియు, "దేవీం సరస్వతీంవ్యాప్తః" అనియు, బాఠభేదములం బొందియున్నది. "ఉదీరయేత్" ఉచ్చారయేత్ జన ఇతి శేషః, "ఈరక్షేపే" అనుట వలన నుత్పూర్వక మైనయీరధాతువున కుచ్చరింపఁ దగినదని యర్థము. కావున నిది వ్యాసకృతము కాదనియు, సౌతివైశంపాయనులలో నెవ్వరిదో యనియు, నిర్ణయింపవలసియున్నది,

"శ్లో॥ మన్వాది భారతం కేచి దాస్తికాది తథాపరే
తథోపరిచరా దన్యే విప్రా స్సమ్యగధీయిరే॥"

ఇది యెవ్వరు చెప్పినదైన నిందుఁ గొంతసత్యము గానవచ్చెడిని మహాభారతమున వారువారు కొంతకొంత చేర్చిరనుట నిశ్చయము. మొదట సూతశౌనకాదులయు, జనమేజయ వైశంపాయనులయు సంవాదాదికము, వ్యాసస్తుతి లోనగుసంశములవలన నాయాభాగములు సౌతివైశంపాయనకృతము లని చెప్పవచ్చును. ఆలోచింపఁగా నుపరిచరవసుచరితము మొదలుకొని వ్యాసకృతభారత మనియు, అందుఁ దనజన్మాదికము ప్రథమపురుషములోఁ జెప్పె ననియు, చెప్పుట సమంజసము. వ్యాసుఁడు రచించిన 60 లక్షల భారతములో నొక లక్ష మాత్రమే భూలోకమునకుఁ బ్రసాదించె ననియు, అవి యిప్పుడు పైనఁజెప్పిన చొప్పున సపాదలక్షమై సార్థలక్ష మైనదనియుం జెప్పవచ్చును. సంగ్రహాధ్యాయపర్వంబునఁబట్టి సరియైనలెక్క చేసికొనవచ్చునో యన నదియు బహుమార్గంబులం బొందియున్నది.

"శ్లో॥ ఇదం శతసహస్రాఖ్యం శ్లోకానాం పుణ్యకర్మణామ్।
ఉపాఖ్యానై స్సహజ్ఞేయం శ్రావ్యం భారత ముత్తమమ్।
చతుర్వింశతిసాహస్రం చక్రే భారతసంహితామ్।
ఉపాఖ్యానై ర్వినా తావ ద్భారతం ప్రోచ్యతేబుధైః।
తతోధ్యర్ధశతం భూయ స్సంక్షేపం కృతవాన్ ఋషిః॥"

వ్యాసకృతభారత ముపాఖ్యానములతో 100 వేలనియు, ఉపాఖ్యానములు లేక 24 వేలనియు, పీఠికవలెనున్న యనుక్రమణి కాపర్వమనుపేరితో 150 శ్లోకము లనియుఁ దేలుచున్నది. ఇందు 8800 శ్లోకములు సుదృఢగ్రథితములు. అనఁగా భేదించుటకు నశక్యములై వ్యాసఘట్టము లని పేరుపొందినవి కలవు. మఱియు నిప్పుడు ముద్రితములై యున్న భిన్న దేశప్రతులందుఁ బెక్కులు పాఠభేదములు, వ్యత్యయవిపర్యయములు పడి మిక్కిలి దుర్జ్ఞేయములై యున్నవి.

మఱియు నిందు "జయ ముదీరయేత్" అనుచోట "జయ" మనుసంజ్ఞ. సంగ్రహాధ్యాయపర్వమునకు మాత్రమే యనియు, సర్వ భారతమునకుం గా దనియు గొందఱు పలుకుచున్నారు. అది తప్పు. స్వర్గారోహణపర్వములో "జయోనా మేతిహాసోయమ్" అనియున్నది. కావున సర్వభారతమునకు "జయ" సంజ్ఞ కలదు.

1 వ పుట 1వ పద్యము:— "శ్రీయన్ దేవియు వాక్కునై" ఇందు సృష్టిస్థితిలయములక్రమము పాటింపఁ బడలేదు. కాళిదాసుఁడు "ప్రళయస్థితిసర్గాణా మేకః కారణతాం గతః" అని వరుస నతిక్రమించెను. నన్నయ తనభారతాదిని "శ్రీవాణీగిరిజాః" అని క్రమము నతిక్రమించియే వ్రాసెను. సృష్టిస్థితిలయములు చేయువారు బ్రహ్మ విష్ణుమహేశ్వరులు మూవు రని నన్నయ పద్యము. ఇందు బ్రహ్మ విష్ణు మహేశ్వరనామములు గలవాఁ డొక్కఁడే యనివర్ణితము. అప్పుడు పైక్రమముతో నవసర మక్కఱయే లేదు. దేవి = పార్వతి; అనిమహా కవులప్రయోగములు పెక్కులు కలవు. ప్రకృతి = సృష్టిస్థితిలయకా రణభూతమై సత్త్వరజస్తమోగుణాత్మకమైనశక్తి యని యర్థము. తన్ — తన్ను; తన్నుమిన్వాదులయుత్త్వలోపము వైకల్పికము; ఈరు + ఏడు = ఈరేడు = పదునాలుగు; లలి = విలాసము; ఇంద్రజాలోద యోపాయము = కనుకట్టు, మాయ, అయ్యుపాయము = వెరవు; విలా సార్థము మాయచే నిట్లు జగములు నిర్మించి పెంచి తుంచు నని భావము; సర్వాతిస్ఫాయత్తేజము = అంతటను వ్యాపించిన (అతిశయిం చిన) తేజస్సు; స్ఫాయత్ = శతృర్థకము; సర్వేశ్వరుఁడు = సర్వరక్ష కుఁడు సర్వకారణమైనయేకేశ్వరుఁడు "విశ్వమేవేదం పురుష స్తద్విశ్వ ముపజీవతి" అని శ్రుతి. అట్టివాని సేవింతు నని" ఆశీర్నమస్క్రియా వస్తునిర్దేశో వాపి తన్ముఖమ్" అనుటంజేసి యిట నమస్క్రియారూప మంగళాచరణము ముఖమైనది. ఆదియందు శ్రీశబ్దప్రయోగము మగ ణంబును ముఖ్యములై ప్రఖ్యాతిం గాంచుచున్నవి. ఇందునాటకంబునకున్

బోలె మనాక్యావ్యాఖ్య సూచనంబును22 పద్యములు గలనాందీవిధానము గలదు.

1,2—కవితావిశేషవిరాజమాన విద్యావిభవుండు = కవి వేద శాస్త్రశ్రౌతస్మార్తాదివిద్యలు చదివినను, కవిత్వవిశేషముచేతనే విద్య (విజ్ఞానము) గలవాఁ డయ్యె నని భావము; త్రిపురసుందరి = బాలా మహామంత్రము; శ్రీ = శ్రీవిద్యయని తెలియందగు; శ్రీవిద్యోపాసకు లగుటచేతనే కవివంశమువారు శ్రీపాదవారై రని ప్రఖ్యాతి.

1,4—సోమాజి = సోమయాజి (వైకృతము) మంత్రీంద్రుఁడు = కవితండ్రిగారు కోటరామభూపతియనుమన్నెసుల్తానునొద్ద దివానుగా నుండి రని తెలియుచున్నది. సుకలుఁడు = దాతయు, భోక్తయునైన వాఁడు; సుకృతము = పుణ్యము, పుణ్యలోకము; బుధేశుండు = విద్వచ్ఛ్రేష్ఠుఁడు; దేవతాధిపతి, పరమశివుఁడు నని యర్థములు.

1, 5— ఉదరమున మోచి కని పెంచుటచేఁ దల్లియును, బ్రహ్మోపదేశముచేసి శ్రుతము గలిగించి మంచుటచేఁ దండ్రియును, బ్రహ్మజ్ఞాన మొసంగి మోక్షసామ్రాజ్యమం దధివసింపంజేయువాఁ డగుటచే గురుండును నరుస నర్చనీయులని శాస్త్రప్రమాణము గావున మాతాపితృపూజ యిందిట్లు యథాశాస్త్రముగఁ గావింపఁ బడినది.

1, 6— “ఋగ్యజుస్సామాథర్వణాని చ్ఛందాంసి” అనుటచే ఋగ్వేదము, యజుర్వేదము, సామవేదము, అథర్వవేదము నని వేదములు నాలుగు “ఇతి వేదా స్త్రయస్త్రయీ”అనుటంజేసి మొదట మూఁడే వేదములు; వానినుండి విడఁదీసినకొంతభాగమునకే యథర్వణ వేద మని పేరు. యజుర్వేదములో నున్నమంత్రములే కొన్నికొన్ని తక్కిన వేదములోఁ జూపట్టుచున్నవి. “తస్య యజు రేవ శిరః, ఋగ్దక్షిణః పక్షః సామోత్తరః పక్షః” అనుటంజేసి వేదపూరుషునకు యజుర్వేదము శీర్ష మనియు, ఋక్సామములు దక్షిణోత్తరపక్షము లనియుఁ దెలియుచున్నది. “ఘనపాఠంబుగ వేదమ్ముం జదువుటే కాక॥

వేదములకుఁ బడసి భాగమే కాక పరావృత్తులం జేసి క్రమజటాఘనములు
పారుమములై కల్పింపఁబడినవి. "నాతాతకుం దాతపత్ని" గ్రంథకర్త
తాతతాత వర్ధ్యోరంజిక్షితులుగారు వేదశాస్త్రశ్రోత్రియులు చదువు
టయే కాక శాస్త్రవిద్యయందును దక్షులై రఘుదేవపురము మంద
పాటివారి సంస్థానమున దివానుగానుండి రనియు, ఆయనధర్మపత్ని
వారణాసి కేశవావధానిగారి పుత్రిక పాపసోమిదేవమ్మగారు తండ్రి విద్యా
ర్థులకుఁ బాఠములు చెప్పుచుండ సంతతశ్రవణంబునం జేసి ఘనాంతము
యజుర్వేదము, చతుర్ఘనాంతము శ్రౌతము, షోడశకర్మాంతము స్మార్తము,
కొంతసామము నేర్చిన దనియుఁ దనకుమారుఁడు వేంకటసూరికిఁ దానే
విద్యలు చెప్పి పండితునిం జేసె ననియుఁ జెప్పుదురు.

శ్లో॥ "స్త్రీశూద్రద్విజబంధూనాం త్రయీ న శ్రుతిగోచరా."

అనుటంజేసి స్త్రీ యగుపాపసోమిదేవమ్మ వేదాధ్యయనము
చేయవచ్చునా యని శంక. చేయఁగూడ దనునది సామాన్యవచ
నము. సామాన్యముగా స్త్రీలు వేదము చదువరాదుగాని యాయజూక
న్వయమునఁ బుట్టిన స్త్రీలకు మాత్ర మది వర్తింపదు. సోమిదేవమ్మ
యజ్ఞములందు "అశ్మానాసనేత్యాదిమంత్రములు వేదవేలు చెప్పవలయును.
మఱియును బత్నీసంయాజలు లోనగుమంత్రహోమములు చేయవల
యును. ఇట్టిచో స్త్రీ వేదము చదువఁగూడదు వినఁగూడ దనిన యు
క్తము కాదు యగును. కావున పైశ్లోకము సామాన్యప్రవచన మని తెలి
యందగు. ఇటువంటిలోనగువారు ప్రమాణముగనున్నారు. మఱియు ఈ
పాపసోమిదేవమ్మగారు శ్రౌతమున సంగ్రహించెను కాని అధ్యయనము
చేసి యుండలేదు. ఇది యథార్థముగా పూర్వ పెద్దలు వ్రాయుచున్నది. "సా[illegible]
[illegible] [illegible]" ప్రత్యక్ష [illegible] [illegible] [illegible]
[illegible] [illegible] [illegible] ప్రస్తుతము [illegible]
[illegible] [illegible] [illegible]

వస్త్రగాలితమ్ముఁ బాధ్యతర్పణము చేయుచుండెఁ. ఆలో దీక్షితులు తా సించక త్యాగము లనంబడుమంత్రములు ఇంచుక తప్పుగాఁ జెప్పుటం జేసి కర్మము చెడు నని సోమిదమ్మ యిది యిట్లని సూచించె: అది తన కవమాన మగుటంజేసి ధృష్టి (అగ్నిం గెల్లగించు చేఁడ్రికోఁపు)తో నామెమోమునం గొట్టె దాన నట గంటుపడి రక్తము కారుచుండ నధ్వర్యుఁడు క్రోధతామ్రాక్షుఁడై బావపైఁబడి మొత్త నున్నంతలో సోమిదమ్మ తమ్మున కడ్డుపడి వారింపగా నతఁడు, "ఇతఁడు నిన్నేల కొట్టవలయు నిదె రక్తము స్రవించుచున్నది. నేను జూచి సహింప జాల ననిన నామె గార్హపత్యములోని భస్మమించుక తీసి గంటుమీఁదను రక్తముమీఁదను వ్రాసె ననియు, గంటుగాని రక్తముగాని కానరాదనియు నామెచరిత్రమునఁ గలదు. ఇత్యాదు లెన్నియో మహత్వము లామె కడం జూపట్టుటంజేసి "సాక్షాత్పరదేవత" యని యాటఁ బ్రసిద్ధింపఁ బడినది.

2, 7— వాల్మీకులు = పూజ్యార్థ బహువచనము. ఈతఁడు బ్రాహ్మణుఁడై పుట్టియు వ్యాధుఁడై మహామునుల కరుణాకటాక్షమున రామమంత్రోపదేశము నొంది తనపైఁ బుట్టలు వారునట్లు జపించి మహాత్ముండై గాయత్రీరామాయణం బొనరించి రామతారకంబున లోకమును దరింపజేసె. వల్మీకమునుండివచ్చినవాఁడు గావున వాల్మీకి నాఁబడె నని తెలియందగు. సుశ్లోకులు = మంచి కీర్తిగలవారు; కృత్తచిత్తగతశోకులు = కోసివేయబడినమనోదుఃఖములు గలవారు; " ఛిన్నం ఛాతం లూనం కృత్తం" అమరము. హర్షితసర్వలోకులు= సంతోషపెట్టఁబడిన సమస్తజనులు గలవారు; అమేయవివేకులు = మితి లేని దేహాత్మాది విభేదజ్ఞానము గలవారు; ఇందు సర్వత్రి వృత్త్యనుప్రాస మలంకారము.

2, 8— వేదములు విభజించినగొప్పతనము గలవాఁడై యనఁగా వేదములలోని సమస్తధర్మములుం దెలిసి, విశ్వోత్కర్షధర్మాంగమ్ము

ప్రపంచమందుఁ జెప్పబడు ధర్మములకు స్థానమై లేక దేహమై విశ్వ శబ్దమునకు సమస్తార్థమును గలదు; వేదార్థంబును బోని భారతమహా వేదంబు = వేదములకు వ్యాఖ్యానమట్టిది "భారతః పంచమో వేదః" అనుట నిట్టి ప్రయుక్తము. కల్యాదిన్ = కలియుగము మొదట: ద్వాపరాంతమున భారతయుద్ధము జరిగినది. తరువాతఁ గొంతకాలమునకీ భారతము రచింపఁబడినది. లోకము లుద్ధరించినఘనున్ = లోకము మధోగతిం బడకుండ శాస్త్రములు పేర్కొనుటం జేసి యిట్లు చెప్పంబడె; వ్యాహారసిద్ధాన్ = మాటలచేతనే సఫలమైనప్రయోజనములు గలవానిని వ్యాహారసిద్ధుఁడు గావున వచస్సిద్ధికిం బ్రసిద్ధుండని, సార్థక ప్రయోగము: వేదవ్యాసుఁడు = ఇది బిరుదనామము; సమస్తధర్మములఁ జెప్పు గ్రంథములు విరివిగా వ్రాసెను గాన నతని కాపేరు వచ్చినది. ఆదికాలమున శ్వేతరూపుఁడైన శ్రీమహావిష్ణుముఖమునుండి శ్వేతరూపుఁడైనవ్యాసుఁడు పుట్టె ననియు, అతఁడే వేదములు విభజించె ననియు భారతము శాంతిపర్వమున నున్నది! ఆకర్తృత్వ మీసత్యవతీసుతుం డగు వ్యాసునకుఁ గట్టిపెట్టి మనవారు వ్యవహరించుచున్నారు. అతఁడే యితఁడు గాఁ బుట్టె నను నభిప్రాయమో? లేక యితఁడు గూడ వేదములు విభజించెనో తెలిసికొనవలసియున్నది. ఈవ్యాసుఁడు నల్లనివాఁడు భారతాదులు పెక్కుపురాణములు లోనగునవి రచించినవాఁ డనుట నిర్వివాదాంశము.

ఈ సందర్భమున భారతయుద్ధ మెప్పుడు జరిగినదో? భారత మెప్పుడు రచింపఁబడినదో? తెలిసికొనుటావశ్యకము కాకపోదు. చిత్తగింపుఁడు. మహాభారతగాథ త్రాత్రికాలమున జరిగె నని కొందఱు చారిత్రకు లూహించుచున్నా రని వినుచుందుము. త్రాత్రికాలము క్రీ. పూ. 1400 సం॥వత్సరని ఆంగ్లేయభాషాకోవిదులు నిశ్చయించిరి. బాలగంగాధరతిలకుగారు క్రీ. పూ. 3000 సం॥ మొదలుకొని యని చెప్పిరి. ఈ కోవిదులలోఁ గూడ భేదాభిప్రాయము లున్నవి. ఏ రే గ్రంథములో

చూచి యెట్లునిర్ణయించ యుందురో. మఱియొకరు బయలుదేరి క్షాత్ర కాలము 1,2 సందలని కాని పదునారుకాని పలుకవచ్చునని తెలుచున్నది. కావున నాంధ్రభాషాకోవిదుల విమర్శనములు సమీచీనములు కావని నిర్ణయించుట కవకాశము గల్గుచున్నది. అథర్వసంహిత భారత కాలముతరువాతి దని వారు తలంతురట. ఇది[illegible]త్రికాలము [illegible]లంఘ్రువంటిదే. అథర్వసంహితలోఁ బరీక్షితుని పేరు, జనమేజయుని పేరు, కానిపించుచున్నదట! దానంజేసి కాలనిర్ణయము చేయవచ్చునని వారితలంపు అథర్వసంహితలోఁ జెప్పఁబడిన జనమేజయుఁడు పరీక్షిత్తు భారత కాలమునాఁటివారు కారు. అప్పటివారు వేదములో నున్న పేళ్ళు తమ బిడ్డలకుఁ బెట్టుకొనుచు వచ్చిరని జైమిని తనసూత్రములలో వ్రాసియున్నాఁడు. అదియే నిశ్చయము. అథర్వసంహితలో జనమేజయ పరీక్షిత్తుల పేళ్లున్నవి. తత్పూర్వులైన కురుపాండవుల పేళ్లందు లేవని వారే యంగీకరించుచున్నారు. అద్దాన నథర్వసంహితలోని పరీక్షిజ్జనమేజయులు కౌరవవంశీయులు కారు. వారనేకాధ్వరములఁ జేసిన గొప్ప వారు. వారు కౌరవవంశీయులే యైనచో ధర్మరాజుకంటె జనమేజయుఁడున్నతుఁడని తోఁపవచ్చెడిని.

భారతయుద్ధము క్రీ॥ పూ॥ 2000సం॥ లకు మున్ను జరిగెననియు నిప్పటికి సుమారు 3945 సం॥లయినదనియు వ్రాసిరి. దీనంజేసి పాశ్చాత్యశాస్త్రజ్ఞులనిర్ణయము లన్నియు సరికావని తెలియందగు భారతయుద్ధకాల మితరగ్రంథములచే నిర్ణయింపనెంచుటకంటె భారతముచేతనే నిర్ణయించుట సమంజసము. మఱియు భాగవతము ద్వాదశస్కంధములో భావికాలగతులను శీర్షికక్రింద ఉపరిచరవసువు మొదలుకొని మగధరాజ్యము నేలినవారిలోఁ గడపటివాఁడగు పురంజయుని వఱకు 1000॥ సం॥ లు॥ వెనుకఁ బ్రద్యోతనుఁడు మొదలు 138 సం॥ లు॥ పిదప శిశునాగుఁడు మొదలు మహానందివఱకు 360 సం॥లు॥ మహానందిసుతులు 100 సం॥లు. ఆపైఁ జంద్రగుప్తుఁడు లోనగువారు 10మంది

మౌర్యులు 137 సం॥లవెనుక శృంగులు 10మంది 100సం॥ రము లవల నాశ్శీగలుం గానగువారు 68మంది— 1099 సం॥లు పిదప యానులు 300సం॥లు. ఈ మొత్తము 3234సం॥లు. "ఆరభ్య భవతో జన్మ యావన్నందాభిషేచనం, ఏత ద్వర్షసహస్రంతు శతపంచదశోత్తరమ్" 1115 సం॥ లని భాగవతమందే మతియొకచో నున్నది. ఈ లెక్కకును పై లెక్కకు సమానత లేదు. ఈ భాగవతపులెక్క యేమానముచేత వ్రాయఁబడినదో తెలియుట సాధ్యముకాదు. సరిగాఁ గానిపించుటలేదు.

శ్లో. యదా మఘాభ్యో యాస్యంతి పూర్వాషాఢాం మహర్షయః

తదా నందాత్ప్రభృత్యేష కలి ర్వృద్ధిం గమిష్యతి.

"త్రిషత్యబ్దశతం నృణామ్" మనుష్యమానముచే సప్తఋషులు ప్రతినక్షత్రమందును నూఱేసిసంవత్సరంబు లుందు రనియు వారు పూర్వాషాఢను బొందినప్పుడు నందుఁడు రాజగు ననియు నున్నది భారతయుద్ధకాలమున మఖలోనున్నారు. మఖ మొదలు పూర్వాషాఢవఱకు 10నక్షత్రములు గావున 1000సం॥ లగును పురంజయుఁడు మొదలు మహానందివఱకు 498సం॥లు. బృహద్రథుఁడు మొదలు పురంజయునివఱకు 1000సం॥లో బృహద్రథజరాసంధులకు 50, లేక 100సం॥లు తీసివేసినను 1448, 1398 సం॥లగుచున్నది. కావునఁ బరీక్షిన్నందుల మధ్యకాలము 1115 సం॥లనులెక్క యెట్టిదో తెలియదు. కావున నీభాగవతముప్రకారము లెక్కవేసి మహాభారతయుద్ధము క్రీ॥ పూ॥ 1535 సం॥ లని వ్రాసినవారివ్రాత లపాస్తము లగుచున్నవి.

జ్యోతిశ్శాస్త్రజ్ఞులిప్పటికిఁ గలిప్రవేశము 5046 సం॥ లని వ్రాయుచున్నారు. అదియే సుసంగత మని తోఁచుచున్నది. "యదా దేవర్షయ స్సప్త మఘాసు విచరిష్యతి" అనుటంబట్టి సప్తర్షులు మఘానక్షత్రమందున్నప్పుడు భారతయుద్ధమయినదని భారతభాగవతగ్రంథములు చెప్పుచున్నవి. అప్పుడు మఖచివరభాగమున నుండిరి. నడుమ నొకమఖ గడచినది. ఇప్పుడు మఖఁజేరిరి "త్రిషష్ఠం త్యబ్దశతం నృణామ్" నక్షత్ర

మునకు నూటేసిసం॥ లని లెక్కయే. అప్పటిమఖ పునగుపుబ్బ మొదలు కొని యిప్పటికిమఖకు బూర్వము నాశ్లేషపర్యంతకు నెనవనక్షత్రములు ఈ లెక్క ప్రకారము 5300 సం॥ లు. ముందటి మఖలో నించుమించు 25 సం॥ లు ఈమఖలో 25 సం॥ లు కలిపిన మొత్తము 5850 సం॥ లగును. దీనిప్రకారము పంచాంగకర్తలు వ్రాయు లెక్కకు 300 సం॥ లు. హెచ్చినవి. దీని కేమంటురన "యే బార్హ దధభూపాలా భావ్యాస్తే సహస్రం సంవత్సరం తుంగాదయ స్తైతే భోజ్యంతి మహీం వర్షశతాధికమ్"ఇట్లు కొన్ని స్థలముల సరియైన లెక్క చెప్పక మొత్తము లెక్కను జెప్పుచుందురు. అది యిప్పటి నాచారమే ఆయజ్ఞము సహస్ర బ్రాహ్మణ్యాము భుజించినది"ఇందుగొంచెమించుమించుగలిగియుండును. అట్లే యీవిషయమును సప్తర్షులొక నక్షత్రమున నూటేసియేండ్లుందురని యించుమించు చెప్పియుందురు. ఇప్పుడు కొందరు బుద్ధిమంతు లానూటిలో నై దేసిసం॥ లకు బైగా గొన్ని మాసముల చొప్పున దగ్గించి కలిప్రారంభము 5046సం॥ లని వ్రాయుచున్నారు. నక్షత్రమునకు నూటేసిసం॥ లని స్పష్టముగా చెప్పియుండ నీతీసివేతలేమి యని నిరసింతురేమో? అట్లయినచో మఖయందు సప్తర్షు లున్నప్పుడు భాగయుద్ధమైనది. సదుమ మొకమఖగడచినది. ఇప్పుడు మరల మఖ వచ్చినదని సర్వజనులు నంగీకరించిన విషయమేకావున నూటేసిలెక్కప్రకారమే చెప్పుకొని యిప్పటికి గల్యబ్దములు 5850లని నిర్ణయించినను సమంజసమేకాని యిప్పటి వారినిర్ణయము మాత్రము సంజసము కాదనియు గలిప్రవేశము 5000 దాటినదనియు, పిమ్మట గొన్ని సంవత్సరములలో భారతము రచింపబడినదనియు నెఱిగి ప్రవర్తించుట సమంజసమని మాయభిప్రాయము.

2,9—ఏవి విలాసవాక్యములు = లోకములో విలాసముగా వాడుకొనుమాటలు, కఱకంఠుడు,ప్రాణగొడ్డము, లోనగునవి కావ్యగ్రంథములో గవిత్రయము వాడుటంజేసి వ్యావహారికము లగునవి లాక్షణిక

ముత్తై స్వీకరించ [illegible] = ఉత్కృష్ట [illegible]
ప్రసిద్ధి; ఖ్యాపనసేయుచున్ = తెలియఁజేయుచున్, [illegible] =
అనివార్యముగ;

2,11 — వెలనాటివైదికవిప్రుండు = వెలనాడు, వేఁగినాడు, కోసల
నాడు, తెలుఁగనాడు, ఇత్యాదులు దేశనామములు. కోనసీమ, లంకసీమ
జల్లిసీమ యనునట్టివి విదర్భదేశమునకు వెలనాడని పేరు; అట నుండిన
వారు వెలనాటివారు. రాజమహేంద్రమువారు, కాకినాడువారనునట్లు
ఈస్వల్పభేదముం బురస్కరించుకొని యాయానాడులవారొండొరులు
వివాహములు చేసికొనరు సరిగదా భోజనాదులును మానుకొనునట్టివా
రగుచున్నారు. ఇది మిక్కిలిశోచనీయవిషయము. రాణ్మహేంద్రపురీవర
ప్రస్తుతుండ = రాజమహేంద్రవరపురమున నున్నవాఁడ నని యభిప్రా
యము. శ్రీపాదకృష్ణమూర్తి = శ్రీపాదకృష్ణమూర్తి నని కవి పేరు
చెప్పుకొనుచున్నాఁడు. సమర్థుఁడిట్లే చెప్పుటాచారము.

2,12 — సత్యకథ = సత్యనారాయణోపాఖ్యానము; ఏకావళి =
ఏకావళీపరిణయము; కావేరికథ = కావేరిచరిత్రము; ప్రద్యుమ్నభద్ర
చరిత = ప్రద్యుమ్నభద్రోపాఖ్యానము; మోహిని = మోహినీమనోహరము.

3, 13 — భద్రాద్రిచరితము = భద్రాచలరామచరితము; గాంధి =
గాంధివిజయధ్వజనాటకము; తిలక = తిలకమహారాజునాటకము; భోజ
నాటకము = భోజరాజీయము లేక బాలభోజనాటకము, సురభిచరితము
సురభిరాజవంశావతారము; నైషధీయము = నైషధీయచరితము; ఏకా
దశాక్షరి = శుద్ధాంధ్ర నిరోష్ఠ్య నిరూష్మక నిర్వచనైకాదశాక్షరి,
న్యాయపతి = సుబ్బరాయచరిత్రము; జీడికలురామచరిత్రము = జీడికంటి
రామాయణము; వేదశైల మహత్వము = వేదాద్రిమాహాత్మ్యము; విజ
యలక్ష్మి = విజయలక్ష్మీవిలాసము;

3,14 — సంపూర్ణభారతినాటకము = భారతయుద్ధ నాటకము,
అన్నవరమహిమ = అన్నవరక్షేత్రమాహాత్మ్యము, తిరుమలాపురక్షేత్రము

తిరుమలాహారక్షేత్రమాహాత్మ్యము, గాణేశ, గణేశపురాణము ఆంధ్రసర్గ స్వము= ఆంధ్రభాషామయ గ్రంథమును కాశీనాథ సృజించును; ఫలసార = సకలఫలసారము, దోషశృంఖల=దుష్టరదోషశృంఖలము; గ్రామ్యవన కుఠార–గ్రామ్యారణ్యకుఠారము, ధన్వంతరీయము=ధన్వంతరిచరిత్రము; మాలతీమధుకరీయము = మధుకర విజయము, అమృతనాథ = అమృతానందము.

3, 16—నిర్నిద్రప్రబోధాప్తి=వికసించిన విజ్ఞానము పొందికచే; అయగారు=తండ్రిగారు, ప్రియము=సంతోషము; నిత్యానుబంధంబు గన్ = ఎడతెగని సంబంధము, కట్టుబాటు;

3, 17—ప్రకృతిన్=స్వభావము, సంస్కృతభాష; (ఆంధ్రభాష వికృతి యనియు, సంస్కృతము ప్రకృతి యనియు వ్యవహారము) అనువు=అవకాశము, ఉపాయము, ఒప్పునట్లని భావము.

3, 18— నలినోదరాంశభవుండు=విష్ణ్వంశమునంబుట్టినవాడు; "వ్యాసో నారాయణో హరిః" అనుటంజేసి నారాయణమూర్తియైన వ్యాసులు; మూడువత్సరముల్ = మూడుసంవత్సరములు; గణపతిలేఖకుండుగా నుండ హిమవత్కందరమందుండి వ్యాసుండు మూడుసంవత్సరములలో 60లక్షలభారతము రచించెనని తెలియుచున్నది. దానిని నన్నయభట్టు, తిక్కన్న, యెఱ్ఱనార్యుండను మహాకవులు ముగ్గురు మూడునూర్లయేండ్లకుం దెలుంగుభాషలో వ్రాసినారని చెప్పుదురు. రాజమహేంద్రపురాధీశ్వరుం డగురాజరాజనరేంద్రుండు భారతము తెలుంగునం బరివర్తనముచేయింప నెంచి కన్నడదేశంబునం బ్రసిద్ధపండితుండై యుండునన్నయభట్టారకునిం బిలువనంచి భారతము తెలిగింప నియోగించుటయు నతండు ఆదిపర్వము మొదలుకొని యారణ్యపర్వాంతమువఱకు మూడుపర్వములు మాత్రము రచించి మృతించె. ఇట నొక్కవుక్కిడి పురాణగాథం జెప్పుకొందురు. అధర్వణాచార్యులు తా నొక్కభారతము రచించి రాజనరేంద్రునకుం గృతి యీయవలయు నని రాజమ

రచియించె నని తెలియుచున్నది. "శారదరాత్రు" లను పద్యము పట్టుక నన్నయ రచించినదని చెప్పిరి. అయినను ఓ... ఎఱ్ఱాప్రగడ "స్ఫురదరుణాంశు"అను పద్యము కొండొక తాను జూచి చేసె"ననియు నాఁడంబర పూరితము, పరపూరితము" అని యున్నదనియుఁ గింవదంతులు పుట్టించినారు. తిక్కనసోమయాజినాఁటి కారణ్యపర్వము చక్కఁగా నుండి యిప్పుట నేమికారణముననో కొంతభాగములోఁ గొంత కొంత ఖిలమైనది. పదంపడి 80 సం॥ లకు సుమారుగ నందుండు నెఱ్ఱాప్రెగ్గడ పద్యములలో బోయినభాగములు సరిచేయుచు, లేనిచోట్ల గ్రొత్తలు చేర్చుచు నన్నయ చెప్పినట్లుగానే రాజరాజనరేంద్రునికృతిగానే గ్రంథము సరిచేసినాఁడు ఇట్లు తెలుఁగుభారతము 300 సం॥ లకుఁ బూర్తియై లోకవ్యాప్తిఁ గాంచినది. 3, 19— వాగనుశాసనుఁడు = బ్రహ్మదేవుఁడు, సకలభాషా వాగనుశాసన బిరుదము గల నన్నయభట్టారకుఁడు, అఁగెడు = అణఁగు తగ్గిపోవు; మాటలాడుచుండు బయిమాట తోపక తగ్గిపోవునట్టివాఁడనని చెప్పుకొనుట; ఈఁగు = ఇగ్గు, సెనగకొఱగు: నాగము = గజము; ఈదన్ = ఈఁదుటకు; ఈఁద = ఈఁదర, గాలి;

**3,21**—కలికల్మషహరము = కలికాలసంబంధమగుపాపములను బోఁగొట్టునది; "శ్లో॥ కర్కోటకస్య నాగస్య దమయంత్యా నలస్యచ ఋతుపర్ణస్య రాజర్షేః కీర్తనం కలినాశనమ్॥ ఉభే సంధ్యే జపన్ కించిత్సద్యోముచ్యేత కిల్బిషాత్" అనుటం జేసియు, కలకాలపుఁగోర్కి = ఎల్లకాలముండుకోర్కి; కలకాలము = ఎల్లప్పుడు; అట్టికోర్కియే యన నొప్పును గాని చిరకాలపుగోర్కి యన నొప్పదనియు, కవి తనకెప్పటికిని భారతమునఁ గోర్కియని చెప్పుచున్నాఁడు. కోర్కి చిరకాలమునుండియున్న నది నెఱవేఱినపై నాకోర్కి చెల్లిన దగును. అట్లు తగదని కవియభిప్రాయము. ఇఁక నీభారతాంధ్రీకరణవిమర్శ మించుక తెలుపవలసియున్నది నన్నయాదుల భారతము వెలుఁగుచుండ మఱియు భారతము మఱియొక్కఁడు తెనిఁగింపఁబూనుట సాహసమగుట తప్పదు, అట్లు

యిన నిక్షేపల సమగ్రాడై నందు లేని వినుండు. కవి కావ్యపాఠము సేయు కాలంబున సంస్కృతభారతము, తెలుఁగుభారతమును జదువుచుండెడి వాఁడు. తెలుఁగులో భగవద్గీతలు, అనుగీతలు, సనత్సుజాతీయము లోనగు ననేకవిషయములు లోపించుటయు, అనేకవిషయములు వ్యత్యయవినిమయాదులం బడి యుండుటయుఁ జూచి తెలుఁగులో లోపించినపట్ల మూలానుసారముగా సరిచేయుదునో యని సంకల్పించెను. గాని యాసంకల్పము 20, 30, సం॥ లు కడచినను సరిపడినదికాదు. తుద కొకకాలమున లుప్తభాగములు సరిచేయ నుపక్రమించెం గాని ప్రతిస్థలమునందు నట్టిలోపములు తనకుం గానవచ్చుటం జేసి సరి చేయుదునన్న తత్సంకల్పము విడిచి మఱియు నాదినుండి తెలుఁగు చేయవలసినదియే యని నిశ్చయించి యిట్లు కావించె. పూర్తి చేయలేక పోవుదునేమోయని భయముచే నిందు "ఇందింతయే నియు" అని వ్రాసి తనభయమును బ్రకటించె.

4, 23—"ఔచిత్యంబు గ్రహించి మూలంబతిక్రమింపకుండ యథోపయోగంబుగా" ఇట్లు వ్రాసినగ్రంథము మూలానుసారమగునో యని యందు లేని వినుండు. భారతము పెక్కుస్థలములలో బురాణము వలె నుండును. కావ్యమువలె నుండదు. చెప్పినవిషయమే మఱియు మఱియుం జెప్పఁబడుచుండును. పరీక్షిత్తుకథ 3,4 పర్యాయము లీయాది పర్వమున నున్నది" వైశంపాయనుఁడు జనమేజయుం జూచి జనమేజయా! మీతండ్రి వనమున కేఁగి సంచరించుచు నొకచోఁ జచ్చినసర్పశవము నొకముని పైఁ జేసిన నతనికొడుకు శృంగియనువాఁడు సర్పదష్టుఁడవై మృతింపుమని రాజును శపించె" అని చెప్ప జనమేజయుఁడు వైశంపాయనా! వనమున కెట్లు పోయెనో యెందెందు సంచరించెనో సర్పశవము మునిపై నేలవైచెనో శృంగి యెట్లు శపించెనో సవిస్తరముగఁ జెప్పుమనిన వైశంపాయనుఁడు రాజా! మీతండ్రి వనమున కేఁగుటయు మృగములకై సంచరించుటయు తన్నుఁ జూచి మాటాడకున్న మునిపై సర్పశవ

ము వేయుటయు, వానికొఱకు శపించుట లోనగుకథ చెప్పెనని చెప్పి పరీక్షిత్తు తానొకనాఁడు వేటకై యరణ్యమునకేఁగి యని మొదలిడినం డియుం గథ చెప్పెను. ఇట్లు వేఱుస్థలములలోనుండుటను. మూలానుసార మని యున్నది యున్నట్లు తెలుఁగులో వ్రాసిన యెట్లుండునో పాఠ కమహాశయు లూహింతురుగాక. మఱియును, దుర్యోధనాదుల పేళ్ళు 2, 3 మాఱులు మాఱి చేరివడియున్నవి. ఆదిపర్వములో వినతాపుత్రి వలు గరుత్మంతునికథ విపులముగా వ్రాయఁబడియున్నది. మఱియు శాంతిపర్వములో దానికి రెండింతలుగా నదేకథ యనేకశ్లోకములు కొన్ని కొన్ని మార్పులతో నున్నది. ఆంధ్రభారతములో రెండుస్థలములలోను రెండంతలుగా వ్రాయఁబడియున్నది ఇత్యాదు లెన్నో కలవు. అన్నియు నున్నవి యున్నట్లు తెలిగించినఁ బాఠకులకు రుచింపఁ దనుభయంబునఁ దత్తద్విషయము లన్నియు నొకచో వ్రాసి తక్కినచోట సంక్షేపించినాఁడు. అదియే యౌచిత్యంబు గ్రహించుటయు మూలంబతిక్రమింపకుండుటయు, యథోపయోగంబునని కవి యభిప్రాయము.

4, 24 —అమరావతీశ్వరుండు = ఇంద్రుఁడు, వాసిరెడ్డి వేంకటాద్రినాయఁడుగారు, వీరి కమరావతియను రాజధాని కలదు. మఱియు వెల్లయేనుంగును గలిగి దేవేంద్ర వైభవం బనుభవించిన మహాపురుషుఁ డా వేంకటాద్రినాయఁడుగారు (వంశావతారము జూడనగు) ఏలుతండ్రి = పెంచుకొనినతండ్రి. ఏలు = పరిగ్రహించు, ముక్తిల = ముక్తీశ్వరస్వామి కలుగుటం జేసియు, ఉదగ్వాహిని యగుకృష్ణవేణీతటంబున నుండుటం జేసియు, ముక్తిభూమి యైనది. ఇపు డిది ముక్త్యాలనాఁబడుచుండు.

5, 30 —ఇప్పటిరాజమహేంద్రుఁడు, భారతప్రియుఁడు = అనుటచేఁ దొంటిరాజమహేంద్రుఁడు భారతప్రియుఁడై తెలుఁగున భారతము వ్రాయించె, ఈరాజమహేంద్రుఁడు = రాజశ్రేష్ఠుఁడు భారతప్రియుఁడై తెలుఁగున భారతము వ్రాయించె నని తెలియునది.

5.32—పదాబ్జసంభవంబు = పదపద్మములందుఁ బుట్టినది. "పద్భ్యాగ్ శూద్రో అజాయత" అనుటంజేసి శూద్రులు విష్ణుపాదోద్భవులు. సురవిన్నగా కృపాకలితజఘన్యజంబు=గంగానదియొక్క దయగల తోఁబుట్టువు, "గంగావిష్ణుపదీ' అనుటచే గంగయు శూద్రవంశమును విష్ణుమూర్తియొక్క పాదములందు బుట్టిరని తెలియుచున్నది. అధరీకృతరాజద్రాజబిలము = ఈసడింపఁ జేయబడిన యొప్పుచున్న కుబేరుడు కలది. "యక్షైకపింగిలబిల" అమరము. తుర్యవర్ణంబు = నాలుగవకులము, దీసంజేసి వంశము పవిత్రమయినదని తేలుచున్నది వర్ణము = కులము, రూపము మొదలగునవి; గోత్రము= వంశము,పేరు, కొండ మొ॥

6,34—ఉదారుఁడు = ఇచ్చువాఁడు; ధీరుఁడు = ధైర్యవంతుఁడు, విద్వాంసుఁడు, ఘనుఁడు = మేఘుఁడు; గొప్పవాఁడు.వాసి అధిక్యము ప్రసిద్ధి, నుడి = మాట, పలుకు;

6,36—అఖ్య = పేరు, యశము; బిరుదు= బిరుద శబ్దభవము, సార్థచిహ్నము; వేమభూపతికడ = వేమారెడ్డిచెంత; ఇతఁడే అనవేమమహీపాలుఁడనియు, శ్రీనాథుఁడు "శ్లో" అనవేమమహీపాల స్వస్త్యస్తుతవబాహవే। ఆహవే రిపుదోర్దండ చంద్రమండలరాహవే॥ అను పద్యము చెప్పి తనపద్యములో నెన్నివే లున్న నన్నివేలవరాల నొందెనని చెప్పుదురు. ఇతఁడు సం॥ము మొదలుకొని సం॥రమువఱకు రాజ్యపాలన మొనర్చెను. గావున నీసదాశివరెడ్డి వాఁడని తోఁచెడిని.

6,38—శ్రీగిరిమల్లికార్జునుఁ డను రెండేండ్లవాని నుపద్రవములనుండి తప్పించి యొక బ్రాహ్మణస్త్రీ వానిఁ దనకుమారుఁ డని చెప్పి నూతక్కిగ్రామమునకుం గొనిపోయి రక్షించె ననియు నతనివలననే వాసిరెడ్డి వంశము వర్ధిల్లె ననియుఁ జరిత్రము.

6,40—నీకు, గోదరి యిరి కమ్మవారిబిరుదుపేర్లు. వాయఁడనియుఁ గలదు. 6,42—మహీకళత్రులు= భూమిభార్యగా గలవారు

భూపతులు; అసంబు = కీర్తి; యశశ్శ్రప్రథనము. ఢిల్లీ = తొంటిహస్తి నాపురము; ఢిల్లీ రూపాంతరము. షాజహాన్ = తురకరాజు;

ఫరిస్కారము=సన్మానము; నందిగామము= నందిగ్రామ, నందిగ్రామము, ఇది బెజవాడకుఁ బడమటగా 30 మైళ్లదూరమున నున్నది 7,41—బాదుషా, బాదుషహా, పాదుషా= తురుష్క చక్రవర్తులపేరు. మున్నెసుల్తాన్, రాజాబహాదరు సరుదేశముఖ్, దేశపాండ్యా, లోనగు; నవి తురకరాజులనాటి బిరుదములు;

7,48—పురుషార్థములు= ధర్మార్థకామమోక్షములు; ఉపచయంబు = వృద్ధి; సుకృతితిత్పరుఁడు = పుణ్యవంతులం దాసక్తిగలవాఁడు సుకృతి = మంచికృతు లందినవాఁడు.

7,50—చక్రవర్తి షట్కము = హరిశ్చంద్రుఁడు, నలుఁడు, పురుకుత్సుఁడు; పురూరవుఁడు, సగరుఁడు, కార్తవీర్యుఁడు; శాస్త్రషట్కము = తర్కము, వ్యాకరణము, ధర్మము, మీమాంస, వైద్యము, జ్యోతిషము; ఋతుషట్కము = వసంత,గ్రీష్మ, వర్ష, శర, ద్హేమంతశిశిరములు; అంగషట్కము = శిక్ష, వ్యాకరణము, ఛందస్సు, నిరుక్తము, జ్యోతిషము, కల్పము, గుణషట్కము = ఐశ్వర్యము, వీర్యము, యశము శ్రీ, జ్ఞానము; వైరాగ్యము. 7,61—యవనశకము= ఫసలీ: అభ్రగిరిరుద్రులు—అభ్ర— ఆకాశము శూన్యముగావున నిట సున్న (బిందువు) గిరి— పర్వము లేడుగావున సప్తసంఖ్య, రుద్ర— వీరు పదునొకండ్రుగావున నిట నేకాదశసంఖ్యయని యెఱుంగునది, "అంకానాం వామతో గతిః" అనుటంజేసి వెనుకకు లెక్కచేయనగు నపు డిట, పదునొకండు వందల డెబ్బది 1170 సం॥రము లని దీనికి హైనహుాణశకము 1761.

7,55—మచిలీపురమండలము— బందరుజిల్లా, తొల్లియటరాజ్యముచేసినప్రభు వొకండు చొరచేఁపకంటిచుట్టు నేర్పడియుండు గుండ్రనైన యెముకం దెచ్చి యుప్పురప్రాకారంబునకు దర్వాజా [ముఖద్వారము]గా నిలిపి ననియు దానంచేసి పురికి మచిలీపురం బను పేరువచ్చిన దనియు వాడుక.

8,56— నిజాము— హైదరాబాదునవాబు; ఏనెలయు— ప్రతి మాసము నని తెలియందగు; మన్సబుదారి— గౌరవించి యిచ్చెడిజీతము, లేక బహుమానము.

8 61—పడుటను— పతనమగుటను; శ్రమపడుట, చెడుట, శక్తి హీనుండగుటయు చెప్పకొన్న "పాపము వాండు పడిపోయినాండు" అని వాడుదురు.

8,62—ఇనుండు— రాజు, సూర్యుండు, వసుప్రభాళిలుండు— ధనప్రతిభతో నొండినవాండు, కిరణకాంతితో నొప్పినవాండు, ఇద్ధ చారుండు— పరిశుద్ధమైనసడవడిక గలవాండు, వెలుంగుల సంచారము గలవాండు, విబుధుండు— విద్వాంసుడు, వేలుపు; నిధీశుండు— నిధిపతి, కుబేరుండు, నిధులు తొమ్మిది, పద్మము, శంఖము, మకరము, కచ్ఛపము, ముకుందము, కుందము, నీలము, వరము, ననునవి, బ్రిటిష్ ప్రభుత్వము— ఇంగ్లీషుదొరతనము?

8, 63, 64, నజరాన = కానుక; మనసబుదారి = ఉచితవేతనము; జమీనుదారి = కొంతనేలకలిగించుట; మేనవారి = మనుష్యులు మోయుపల్లకి; లోనగునవి; పరగణా = జమీలోనిభాగము; అంబారి = ఏనుగుమీంద నెక్కి కూర్చుండుటకుం దగునట్లు వేయునది; ఇట్లు తురుష్క భాషను వ్యవహరింపం బడు. 9, 66, —నిజాంపట్టణము లోనగుస్థలములలో గ్రామనామములగుటచే వాడుకంబట్టి పట్టణము, పట్టణమని వ్రాయం బడిమె ఆయూ వోట్లం గొత్తన మనియే చెప్పకో నగు వృద్ధిం దోంగు= అభివృద్ధియందు మునుంగు. అని వృద్ధినొందు నని భావము;

9, 67— అరికట్టి= అడ్డగించి, జయించి; పట్టి=గ్రహించి, వేంకటాద్రి=తిరుపతికొండ; పవిత్రమయినదగుటచే నిట్లు ప్రయుక్తము; మాద్రి=సమానము; గేయుండు= కొనియాడం దగినవాండు.

9, 6-, 6-,—వేంకటాద్రినాయండుగారు నానాప్రదేశము లలో నొక్కముహూర్తమంద 108 శివాలయములు, మఱియు నప్పు

డప్పు డమరావతి లోనగుస్థలములలో సహస్రమహామహాలింగములను ప్రతిష్ఠించె ననియు, భూమిపై నలుసట సువర్ణజయస్తంభములు నిలిపె ననియు, సప్తసంతానములు, దశషోడశదానములుచేసె ననియు,౧౦౮ అగ్రహారము లాహ్యల కిచ్చె ననియు, మఱియు ననేక భూదానగృహదానములు, చేసె ననియు, పెక్కుకోట్ల ధనము దానమిచ్చె ననియు, పెక్కుకోట్ల మంది నన్నము పెట్టి పోషించె ననియు, మూడుతులాభారములు తూఁగె ననియు, హిరణ్యగర్భమను జన్నము రాజసూయము పలె నొర్చెననియు, బుడమింగల పుణ్యస్థలము నెల్ల సేవించె ననియు, ఎన్నోదంపతిపూజలు చేసె ననియుఁ జెప్పుదురు, వేనవేలు ధన మర్థుల కిచ్చెననియు, వేయిబంగారుగోవులను చేయించి దాన మిచ్చెననియు, నిప్పుడును వేయినోళ్ళ చెప్పుచుందురు.

దశదానములు—గోదానము—, భూదానము, తిలదానము, హిరణ్యదానము, ఆజ్యదానము. వస్త్రదానము ధాన్యదానము, గుడదానము, శాకదానము, లవణదానము;

షోడశదానములు—గోదానము, భూదానము, తిలదానము, హిరణ్యదానము, రత్నదానము. విద్యాదానము, కన్యాదానము, దాసీదానము, శయ్యాదానము, గృహదానము, అగ్రహారదానము, రథదానము, గజదానము, అశ్వదానము, ఛాగదానము, మహిషీదానము,

సప్తసంతానములు—తటాకము, నిధి, యగ్రహారము, దేవాలయము, వనము, కృతి, సూయియు నని.

అగ్రహారము—పన్నుబంధులు లేకుండ బ్రాహ్మణులుండుటకును బండించుకొని తినుటకు నేర్పఱచి యిచ్చిన మంచిగ్రామము; తులాభారములు—త్రాసులోనొక తట్టున బురుషుండు కూరుచుండ రెండవ తట్టున రత్నములుగాని, బంగారుగాని, వెండిగాని యిడి సరిగాఁ దూఁచి దానిని విప్రులకుఁ బంచిపెట్టుట) మన వేంకటాద్రినాయఁడుగారు తన

తాసందర్శనేచ్ఛ—దివ్యమైన సంతతినిఁ జూచుకోర్కె. కల్పవృక్షక్షేమములను జూచుకోర్కె. శతకోటిశక్తి సంతతవైభవంబు = నూఱుకోట్ల ధనము గలిగిన శక్తి వజ్రాయుధముశక్తి. నాకరాజ్యప్రాప్తి=పాపము లేనిరాజ్యము నొందుట. స్వర్గరాజ్యము నొందుట–ఇట్లింద్రునితోఁబోలి బ్రహ్మహత్యాఘము = బ్రాహ్మణుని చంపినపాపము (వృత్రునిసంహరింపఁ బాపమింద్రునంటె) దుష్టవర్తనము = అహల్యాదివిషయముల చెడ్డతనము–సత్రభుక్త్వము = యజ్ఞభోజనమైన నిట సత్రశబ్దముచే నింద, సత్రము = అన్నప్రదానగృహము, అట భుజించుట తగదని శాస్త్రము. వేశ్యాప్రసక్తి=అప్సరస్త్రీసంభోగము. గోత్రభిత్త్వము=పర్వతముల భేదించుటఁ గులములను గూల్చుటయని శబ్దధ్వని. ఇవి యింద్రునకుగల దోషములు. ఇతనికి లేవని కల్పనము. 10-76—నృపకౌశికుఁడై కౌశికుఁడు=ఇందు ఇంద్రుఁడు శ్రేష్ఠార్థవాచకము. నృపశ్రేష్ఠుఁడు. ఐ=ఒప్పి. ఋతుషితేభవిధుని విశ్రుతము=ఋతు=6. షితి=1. ఇభ=8 వి=అంకానాం వామతోగతిః అనుట 1816 హాయణవత్సరము.

12-92—పాదుషా, పాదుషహా=రెండురూపములు తురుష్కప్రభువు. షంకానగారా, డోలతు. అలుగోజ మూషాళ్ళు–దివ్వెటీలు, ఇత్యాదులు వాళ్ళు బిరుదులుగానుండెను. 13-100—రాఘవమహీకాంతుఁడు ఔరంగజీబు కడకాలమున బేర్మిగాంచెనని చెప్పుటచే నౌరంగజీబుకాలమున నున్నవాఁడు గాన నతఁడు నప్పటివాఁడనియే తెలియుచున్నది.

14-111—పంచపాండవులు=ధర్మరాజ భీమార్జున నకుల సహదేవులు. పంచబాణములు. అరవిందము, అశోకము, చూతము, నవ

మల్లిక, నీలోత్పలము. మఱియు ఉన్మాదన. తాపన. శోషణ, స్తంభన సంమోహనములను నవియుచు, పంచపర్వములు=అష్టమి, చతుర్దశి, కుహువు, పూర్ణిమ, రవిసంక్రాంతి. పంచవదనములు తత్పురుషము ఈశానము, వామదేహము. సద్యోజాతము15-116—శరముపై ద్విజ రాజును జేర్చు=శిరమందు బ్రాహ్మణశ్రేష్ఠుని నిలుపుకొనును. చంద్రుని నిలుపుకొనును. భూతులు = ఐశ్వర్యములు. అణిమాద్యష్టభూతులు, సతికింబతి=పతివ్రతభర్త. సతీదేవికిభర్త క్షితిభూతేశ్వరుడు. భూతేశ్వరుడు, క్షియంతి నివసంతి సర్వే=ప్రాణిభిక్షితిః - ప్రపంచకమనియర్థము గ్రాహ్యము దానికీశ్వరుడు=ఈశ్వరసంజ్ఞ కలవాడనియు ఇతడు నతడును జంద్రమౌళులని యిందు శ్లేషార్థము నూహించునది

115-117—షసటీ = రుద్రదినేంద్రసంఖ్య-రుద్ర 11 దినేంద్ర 12 వామగతిచే 12 11 అగును క్రీస్తుసమత నేత్రవియద్గజేత్రలు=వామ గతి 1802-16-125 శ్రీదేవిపుట్టినిల్లు = పాలసముద్రము. దేవతలు మథించి కలంచిరి. మెట్టినిల్లు=పద్మము, అనుజుడైన చంద్రునిచే గాల్పించెనని. చంద్రునివలన పద్మములు చెడిపోవుననె17-128—వసు పావకసూర్యసంఖ్య యవనాబ్దము 1238. ఉన్మేషింపకున్నప్పుడు=వికసింపకున్నప్పుడు అనగా పెరిగి పెద్దవాడు కానప్పుడు.

17131—యవనాబ్దము. హరిదంభోనిధి మిత్రసంఖ్య అనగా 1248-18-140— సూర్యోపరాగము, సూర్యగ్రహణము. ఉభయతో ముఖగోదానము=ఆ యీనుచున్నప్పుడు రెండువైపులముఖములు(ఆవుది దూడది) అట్టిసమయమున జేయు గోదాన ముభయతోముఖ గోదాన మని అది మహోన్నత దానమనియు వేదములు చెప్పుచున్నవి.

18-143—మంగళదేవి=లక్ష్మి. చపలత్వమున బరుని జేరును. ఈ మంగళదేవియట్లు చనను. మంజువాణి, సరస్వతి, రాగమైనోళ్ళ బడి రచ్చకెక్కును. ఈ మంజువాణియట్లు కాదు. మృగరాజగమన=సింహమునెక్కు పార్వతి. మగని సగము మేను హరించి గద్దరించును ఈ మృగవరాక్షియట్లు చేయదు. విభుదేంద్రదేవి=దేవేంద్రపత్ని శచి మాటవరుసకు నహుషునిగూడ నంగీకరించివదలెను. ఈ విబుధదేవి=పండితునిభార్య యట్లుచేయదు. ఎదవసించి హృదయమందుండి వక్షమందుండి వాగ్దానగాని ముఖమునొంది మాటపట్టి మెలగి, కలసి పోయినను వర్తనమునను౦డునని క్రమాలంకారము.

20-161 నలునచతుర్ముఖంబులు, నాల్గుసంద్రములు గరుడ ధ్వజ, బాహుచతుష్కము. నానొప్పిరి. క్రమముగా గళల, గభీరత. పరామంబన అని సమన్వయము

## —♦ అనుక్రమణికా పర్వము ♦—

ఈసరి యనుక్రమణికాపర్వ ప్రారంభమున సూతశౌనక సంవాదమునందు దీనికిని నన్నయ భారతమునకును వ్యత్యాసమున్నది. న.భా.లో సూతుడు నేను దత్తుండ నా వలన మీరేకథ వినవలతు రని శౌనకాదుల నడుగగా వారు ఉత్తమమేదియో దానిని చెప్పుమని నట్లేయున్నది మూలములో శ్లో॥ ద్వైపాయనేన యత్ప్రోక్తం పురాణం పరమర్షిణా । జనమేజయస్యయాం రాజ్ఞా వైశంపాయన ఉక్తవాన్॥ సంహితాం శ్లోతుమిచ్ఛామోదిర్వ్యా పాపభయాపహా॥ అని భారతమునే చెప్పుమన్నట్లున్నది. శౌనకాదులు నీవెక్కడనుండి

వచ్చుచుంటివని సూతు నడుగగా నతఁడు జనమేజయుని సర్పయాగ మున వైశంపాయనుడు భారత సంహితనుజెప్పగా నటకేగి వినివచ్చితి నది వేదతుల్యమైన యుత్తమ సంహితయనిచెప్పెను.

అప్పుడు శౌనకాదులు దానినే వినవేడితిము దానినే చెప్పు మనిరి. ప్రక్రమమునట్లే యుండునుగాని మఱియొకవిధముగా నుండదు. నీ యిష్టమువచ్చిన కథ చెప్పుమనిన సూతుఁడు తన యిష్టమువచ్చిన మఱియేదేని కథ చెప్పిన నది వీరి కిష్టముగాకున్న నేమియగును. రసాభాసమగును. నీ వెక్కడనుండి వచ్చుచుంటివనుటయు సూతుఁడు నేను జనమేజయుని సర్పయాగమున వైశంపాయనుడు చెప్పుచుండ భారత కథ విని వచ్చితినని చెప్పుటయు లోనగు నంశములు. న. భా లో. లేవు.

23 పుట-180 – శ్రుత్యర్థ ప్రతిపాదకంబు = వేదార్థములను నిరూపించునది. సుమనస్స్తుత్యము దేవతలచే విద్వాంసులచే స్తోత్రము చేయదగినది. ధర్మాత్యర్థ ప్రతిపన్న శాస్త్ర విషయఖ్యాతము. ధర్మ ముచే నధికమైనట్టియు తెలియఁబడినట్టియు శాస్త్రవిషయములచే గాసియాడబడునది. పుణ్యాం సూనంబు=పుణ్యము. ఉత్తమమునైన మంచి కథలతో గూడిన చరిత్రములును ప్రసవములుకలది. భారతా వేశము=భారతికి ఆవేశస్థానమైనది. 23-182-నరగన్, శీఘ్రముగా సద్యస్కాలమున నని యభిప్రాయము సత్వాంబునన్ = కేవల సత్వ గుణముచేత॥ తమహంమరాగమకృష్ణం. కృష్ణద్వైపాయనం వందే॥

అనియున్నది. ఉగ్రశ్రవుడు=ఉగ్రంవీరం. మహాభద్రమ్‌శ్రవ. యస్యస. ఉగ్రశ్రవా. అధిగతోపనిషద్రహస్య ఇత్యర్థ. సూతస్యాపత్యమ్. సౌతి.

శ్లో. బ్రాహ్మణ్యాం క్షత్రియాజ్జాత
సూతఇత్యభిధీయతే, శౌనక. శౌన. వివేకదృక్॥

శౌన ఏవశౌనక, వివేకదృష్టిరిత్యర్థ. వైశంపాయన రాశిశం ప్రజాంపాతీతి. విశంప జనమేజయ. తస్య అయనం గురుత్వేనాశ్రే భూత విశంపాయన : స్వార్థేర్రొప్రత్యయః

23–184–వ్యాసుడు హిమవత్కందరంబున దర్భాసనాసీనుండై భారతాఖ్యానము నెన హృదయంబునదలంచి దీని నెట్లు లోకంబున వ్యాపింపఁజేయుదునని చింతించుచున్నప్పుడు బ్రహ్మ ప్రత్యక్షమగు టయు గణపతిచే భారతము వ్రాయించుటయు లోనగు ముఖ్యవిష యము. న. భా. లో లేదు. ఇది పెక్కుప్రతులయందు కలదు. నన్న యకు దొరికిన ప్రతిలో లేదేమో! అది సరియైన ప్రతికాదు. గణపతి వ్రాయసగానుండి తనగంటు మూగకుండునట్లు కవిత్వము చెప్పితివేని వ్రాయుదునని యొడంబడిక చేసికొని యున్నప్పుడే వ్యాసుడు వాని వడికి తాళజాలక నాపద్యము లర్థము చేసికొని వ్రాయుమని చెప్పి॥ 'అష్టౌశ్లోక సహస్రాణి హ్యష్టౌశ్లోక శతానిచ అని 8800 పలుగు రాలం గూర్చెననుటయు వానికి వ్యాసఘట్టములని పేరు వచ్చుటయు వట్టిదగుచున్నది. కావున గణపతి వ్రాయసగాడుగానుండ నీభారతము రచించినట్లు చెప్పుటయే సమంజసము. ఇట సంగ్రహాధ్యాయపర్వము ప్రతులందు బహువిధములుగా కలగూరగంపయై కలసిపోయియున్నది.

రామాయణమున బాలరామాయణమువలె ఈ భారతాదిని నూట యేబది శ్లోకములుగల సంగ్రహాధ్యాయ పర్వములో భారతమంతయు సంగ్రహముగా వర్ణింపఁబడినది. అట్టిది న. భా. లో విడువఁబడి యున్నది. శ్రీకృష్ణభారతమందు సర్వప్రతులం గ్రోడీకరించి యుచితత్వ మనుసంధించి సంగ్రహించి వ్రాయబడినది.

ఇందు 26-27 పుటలలో వ్రాసిన భారతప్రశంసా పద్యములు కొన్ని ప్రతులలో లేవుగాని కొన్ని ప్రతులలో వ్యత్యాసము గల్గి యున్నవి. ఆ పద్యములు భారతప్రశస్తి నెన్నో విధముల జెప్పుచున్నవి. నన్నయభట్టు వాని నన్నిటిని విడిచి సీ॥ ధర్మతత్వజ్ఞులు ధర్మశాస్త్రం బని అనునొక్క పద్యములో కొట్టివేసినాడు.

27-107 లో నాద్యాద్యష్టాదశ పర్వమున నెన్నెన్ని యుప పర్వము లున్నవో చెప్పబడియున్నది. మఱియు మూలములో ప్రతి పర్వమునందునుగల యెల్లకథలును వేఱువేఱుగా జెప్పుచు నధ్యాయముల సంఖ్యయుఁ బద్య సంఖ్యయు నున్నది. న. భా. లో నట్లులేక కలగూరగంప చేయుబడినది. అధ్యాయ సంఖ్య లేదుగాని శ్లోకసంఖ్య మాత్రము గలదు. అది యేప్రతికిని సరిపడి యుండలేదు.

35-246 ఇట మూలములో ॥శ్లో॥ అహానిదశయుద్ధే భీష్మోదశవై పరమాస్త్రవిత్ అహాని పంచద్రోణస్తు రరక్ష కురువాహినీం ఆహానియుయుద్ధే ద్వేతుకర్ణః వరబలార్దనః । శల్యార్ధ దివసం చైవ గదాయుద్ధమతః పరం । దుర్యోధనస్య భీమస్యదినార్ధస్య భవ త్తయోః తస్యైవదివసస్యాం తే ద్రాణి హార్దిక్య గౌతమాః । ప్రసుప్తం నిశి

విశ్వ స్తం జగ్మురశ్వాది రంబలమ్॥ అని యున్నది. దీనికి వ. భా. లో రెండుపద్యములున్న యవి. దేనియందును మూలార్థం సరిగ రాలేదు రాత్రియశ్వత్థామాదులుచేసిన యుద్ధము రెండుపద్యములందును లేదు. రెండవపద్యమందు పది దినంబులనుదాసిలో విపరీతార్థము గలిగి యున్నది. దాసిలో శల్యునితోక్క పవలు నాగపురీశుడు (దుర్యోధనుడు) ఒక్కరేయియు యుద్ధము చేసినట్లు పైశ్లోకములవలన దెలియు చున్నది. ఇదికాక,

క. మదమున రిణ మొనరించిరి
   నది సుతగురు కర్ణశల్య నాగపురీశుల్

మదమెక్కి వారిలో వారు పోరున ట్లున్నది చూడుడి ఇదియే విపరీతము. ఇట కొందరు ప్రత్యర్థులు యుక్తాయుక్తము లరయజాలకే శ్రీకృష్ణభారతములో నిట చంపకమాల పెద్దదియున్నది. నన్నయ చిన్నదియగు పదిదినములను పద్యములో బెద్దవిషయ మిమిడ్చినా డత్యాదులు ఏవో పలుకుట లాలకించి కృష్ణకవి పద్యము పెద్దదైన నేమి చిన్నదైననేమి విషయమంతయు నుండవలయుగదా! చిన్న పద్యములో నిమిడించుట యొక గొప్పలోనిది కాదు.

క. అరులంబోరిరి నది సుతగురుకర్ణులు మద్రరాజ కురురాడ్ద్రోణుల్
   వరుసఁ బదియైదు రెండ్లశ్వరపగలర పగలుగాగి

హాహాహాహాహాహాహా

38, 11—తపనీయాంచితచూడ=బంగారుచే నొప్పుచూడాముడులు గలవాఁడా; హవిర్ధానము=యజ్ఞశాలలో హవిస్సులుంచుప్రదేశము; ఉపశకటములో నెడమప్రక్క నుండుమూఁడవబోర; హోమవహ్నులు=హోమములు చేయఁదగినయగ్నులు (గార్హపత్యాహవనీయాదులు) 12—నోరులేనియుం జెదలకున్=మాట లాడనేరకున్నను దిట్టతనము లేనివారికి; 13—గ్రహించి= తెలిసికొని. 38, 15—ఇట నయోదధౌమ్యునియు, వానిశిష్యులయు వృత్తాంతము మూలములో నతివిపులముగా వర్ణింపఁబడి యున్నది. దానివలన గురుకులక్లేశము, గురులకు శిష్యులు చేయుశుశ్రూష లోనగుమహోన్నతవృత్తాంతములు చెప్పఁబడియె. అవియన్నియు న.భా.లోఁ బూజ్యమైనవి. మఱియు నట నశ్వినీదేవతాస్తుతి పెక్కుశ్లోకములు గలవు— అవి పారాయణార్హములు; అవి విడిచివేయుట యెంతయేని లోప మనక తప్పదు. ఉదంక, ఉతంక, ఉత్తంక యని పాఠభేదములు గానవచ్చెడిని. ఉదంకగురునిపేరు వేదుఁడు పైలుఁడు నని యుండ న.భా.లోఁ బైలుఁ డని పడినది. అయోధధౌమ్యుఁడు, అపోదధౌమ్యుఁ డని ద్వివిధముం గలదు.

39, 17—దేశికాజ్ఞ=గురునానతి; కేదారము=వరిమడి; మళ్లు=చేనిలోఁ గొంతకొంతభాగముగ గట్లువేసినప్రదేశములు; తూర=నీళ్ళతూము; గనిమ తెగినచోటు; దొడ్డశరీరము=బలసినదేహము; 20—ఉద్దాలకుఁడు= (భూమి) పెకలించుకొనివచ్చినవాఁడు; వృత్తి=జీవనాధారము; 23—భైక్ష్యోపజీవులు=బిచ్చమెత్తుకొని జీవించువారు;

40, 27—జయంతులు=జయశీలురు; 29—సువేములు= మంచిమార్గము గలవారు; గ్రహేంద్రుఁడు=సూర్యుఁడు. ఉషాగ్రహేంద్రులకుఁ బుట్టి=ఉషకు సూర్యునకుం బుట్టి; ఉష సూర్యుని వేఁడికిఁ దాళఁ జాలక బడబారూపమునఁ బాఱిపోవగా సూర్యుఁడు నశ్వరూపమున నామెం గలియ నరిగి దానితోఁ గ్రీడించినప్పుడు కవ లశ్వినీదేవతలు పుట్టిరి.

వారికి సూర్యుఁడే దైవమునని చెప్పె. వారు చంద్రునిలో నమృతము చేసిన కథయు, భానునిలో నల్లమేఘములం బాపినకథయు వేదములం బ్రసిద్ధములై యున్నవి; 30—దారియుం దెల్పునా=ఇది లోకోక్తిగాని ద్విరుక్తి నానొప్పదు. ముల్లెమూట యనునట్లు. 36—ఎద్దువలెఁ బాటు పడితౌ=ఎద్దే దేశమందున్న నెప్పుడును బాటుపడుచుండు నదిగావున, నిట్లు సర్వదా పాటుపడుచుండువాని నెద్దుతోఁ బోల్చిపలుకుచుందురు. ఇట నైచ్య మూహింప నొప్పదు.

42, 39—జనమేజయుఁడు, పౌష్యుఁడు, ఉదంకుఁడును వేదుని యొద్దఁ జదివియున్నవారు గావునఁ గురుపత్ని పౌష్య నడిగి కుండలమ్ములు తెమ్మనుటయు, ఉదంకుఁ డరిగి తెచ్చుటయు, తక్షకుఁ డాకుండలమ్ములు హరింప నుదంకుఁడు జనమేజయునికడ కరిగి సర్పయాగబుద్ధి పుట్టించుటయు, మొదలగుటకుఁ గారణ మగుచున్నది. జనమేజయపౌష్యోదంకులు సతీర్థ్యు లయినట్లు న. భా. లో లేదు. 42, 40=యాజ్యకార్యము=యాగము చేయించుపని; ప్రవాసము = పరదేశగమనము; ఇట మూలములో గురువుగారు శిష్యునకు నిల్లు నిల్లాలి నప్పగించి తాను ప్రవాసమునకుం జనియె అప్పుడు గురుపత్ని ఋతుమతియై శిష్యునిం బిలిచి ఋతువు వ్యర్థము గాకుండఁ దనతో సంభోగింపు మని తాను చెప్పియు నితరస్త్రీలచేతం జెప్పించె. దాని కాశిష్యుఁ డంగీకరింపక యిది యకార్యకరణ మని నిరాకరించె. అంత గురుండు వచ్చి వానిచేఁతకు మెచ్చినట్లు మూలమున నున్నది. నీతిదాయకమైనయీవృత్తాంతము న.భా.లో లేదు. 42, 43—ఈపద్యము మూలార్థమును జెప్పునది కాదు. మూలములో "అథోదంక శ్శుశ్రూషు ర్గురునియోగ మనుతిష్ఠమానో గురుకులే వసతిస్మ" అని యున్నది. ఇంతమాత్ర మునన్ముఖాని నిట్లు శుశ్రూష చేయవలయునని లోకమునకుం జెప్పువాఁడై కవి చెప్పె నని తెలియునది. కుద్దాలము=గుద్దలి, గొద్దాలికము; చేమాట=

కపిలె, (చేతితో పిండుటకు సులభసాధనము) తొట్టు=చెంబువులోనిపాలను; చెంగలి=పశ్వాహారమగు తృణవిశేషము; నక్తోపవసి=ఉపవాసముండి; మృగము, సుకదంబము=సుఖశబ్దభవములు; 46—గురుశుశ్రూషాకరుఁడు=గొప్పగురుశుశ్రూష చేసినవాఁడు; ఇచ్చికోలు=ఇచ్చుట; (అనుప్రయుక్తమైనకోలుధాతువునకు భావార్థరూపము. ఇచ్చికోలు, పుచ్చుకోలుము.) 47, 48—పుణ్యకవ్రతంబు=ఇది యొకవ్రతవిశేషము. ఇందు బ్రాహ్మణసమారాధనము ప్రధానము; ఇట సుదంకుఁడు తనగురువు దక్షిణ కంగీకరింపమి గురుపత్నికడకేఁగి యేమిదక్షిణ యిత్తునని యడుగుటయు, ఆమె పుణ్యకవ్రతము చేయుటకు పౌష్యపత్నికుండలమ్ములు తెమ్మనుటయు స. భా. లో లేదు. 43. 49—వనువు=అనురాగము; ఇంపు; అతిప్రమాణపరిగాత్రమహోక్షము=పెద్దఆకారము గలయెద్దు;

50, 53—ఇట స.భా.లో సుదంకుఁడు పౌష్యపత్నిం గానక పౌష్యునికడకు వచ్చి "నీవ యకుండలమ్ములు తెప్పించి యిమ్ము" అని యున్నది. ఇట్లు మూలమున లేదు. మఱియు వృషభగోమయభక్షణంబున నైనయమదిగా నెంచి నట్లున్నది. ఆవృషభము, ఎక్కివచ్చినపురుషుఁడు, గోమయమును సామాన్యప్రతిపత్తిం బొందియుండినవి కావు పరమపవిత్రములు కావున గోమయభక్షణంబున నశుచి యనవొప్పదు. అపవిత్రమైనను భక్షించినపై నాచమింపవలయును. అట్లుదంకుఁడు చేయమింజేసి పౌష్యపత్ని కానరాదని చెప్పనొప్పు.

54—ఇట స్మృత్యాచమన విధి చక్కఁగాఁ జెప్పఁబడినది. స. భా. లో లేదు. 55—అక్షయపాపకార్యకలితాత్ముఁడు=తగ్గుదలలేనిదోషకార్యములందుఁ గలియఁ గూర్చినకన్నుగలవాఁడు (పాపకార్యమందే దృష్టికలవాఁడని భావము) శాంబరీకరణదక్షుఁడు=మాయచేయుటయందు సమర్థుఁడు; దొంగిలు=దొంగిలించు; మహాపేక్ష=గొప్పకోరిక ధర్మప్రవణా=ధర్మాసక్తురాలా; ధర్షించు=తిరస్కరించు,వంచించు; అనఘనము=సర్వదా; ఏమఱక=ప్రమాదపడక.

44, 59—క్షపియింపఁ బడితి = నిర్వ్యాపారస్థితిగలవాఁడనుగాఁ జేయఁబడితిఁ అనఁగా నాయితరవ్యాపారములు విడిచి యున్నాఁడ నాతిథ్య మిమ్మని (జీవము) కణములు వేయుచు = ప్రాణాహుతులు చేయుచు; ఇట రాజోదంతులశాపప్రతిశాపములందును శాపమోక్షములందును మూలములో నెంతో చక్కఁగా నున్నది. న. భా. లో సామాన్యముగా నున్నది. 61—ఈపద్యమునకు న. భా. లో—"ఉ. నిండుమనంబు" అనుపద్య మున్నది. ఇది నన్నయభారతములో నుత్తమోత్తమ స్థానపద్య మనియు, దీనినే మనుమసిద్ధి వ్రాసిదేశములం దిప్పె ననియు, దిక్కన దానినే వ్రాసి పసపుపూసె ననియుఁ జెప్పు విషయము సత్యదూర మని చెప్పుటయే యొప్పు. దీనిని బోలినపద్యము లెన్నో నన్నయభారతమున నున్నవి. మాటవరుసకు నీ"నిండుమనంబు" విమర్శింతము. దీనికి మూలములో "యథా నవనీతం హృదయం బ్రాహ్మణస్య వాచి క్షురో నిశిత స్తీక్ష్ణధారః తదుభయ మేత ద్విపరీతం క్షత్రియస్య వాచి నవనీతం హృదయం తీక్ష్ణధారమితి త దేవంగతే సశక్తోహం తీక్ష్ణహృదయత్వా త్తంశాప మన్యథా కర్తుం గమ్యతామితి" అని యున్నది. దీని తెనుఁగులో నిండుమనంబు=పూర్ణహృదయము. ఈపూర్ణత యేమిటికో? ఈరెండును కొఱకా? నవ్యనవనీతము=అప్పుడు తీసినవెన్న; ఇందుఁ జల్లనీళ్లు కొఱుగుణ ముండును. అప్పుడు హృదయముతోఁ బోల్పనొప్పదు. పల్కు దారుణాఖండలశస్త్రతుల్యము=భయంకరమైన వజ్రాయుధముతో సమానమైనది. ఆఖండలశస్త్రము=ఆఖండ య త్యరీని త్యాఖండలః అరులను ఖండించువాఁడు; శశ్యతే నేనేతి శస్త్రం, శసు హింసాయాం హింసించునది. ఈరెండుపదములును గ్రూరము లిట్టివజ్రము కొండలను బిండి చేయునది. బ్రాహ్మణునిప ల్కట్టిదనుట వలన బ్రాహ్మణుఁడు ఘాతుకుఁ డగుచున్నాఁడు. మూలములోఁ జెప్పు మనునట్లు

కోయంగలసురియ యని యున్నది. అది చంపునదికాదు. కోసి బాధిం చునది మాత్రమే యగుచున్నది. జగన్నుత=ఇది పనికిమాలినపదికట్టు టాయి; "నశక్తోహం దీక్ష్ణహృదయత్వాత్" దీనికి "ఓ వం దతిశాంతుం డయ్యు" అని పడినది. శాంతుండు తీక్ష్ణహృదయుండు కాడు. శాపము క్రమ్మరించుటకు సమర్థుండే యగుచున్నాఁడు. కావున నిట శాంతుం డనరాదు. భారతములో మనుమసిద్ధి యోజించి పంపించినపద్య మిది యను టకుఁ దగదు. ఇది ప్రక్షిప్తమేమో?

44, 62—ఇట మూలమునం జక్కఁగా నుభయుల శాపములును ద్రోలఁగించుకొనిన ట్లున్నది స. భా.లో నుదంకునికి రాజు పెట్టిన శాపము పోయినట్లు లేదు. ఉదకున కైనశాపము మంచియుక్తిచేఁ దానే తొలఁగిం చుకొనిన ట్లున్నది. 63 —ఈపద్యము మూలస్థముగాదు. సందర్భశు ద్ధిగా నిటఁ జేర్పఁబడినది. 65—దిసమొలక్షపణకుఁడు=వస్త్రహీన మైనమొలగలబౌద్ధమతస్థుఁడు; అసితద్యుతి=నల్లనికాంతి; కసిమసపుచు= విజృంభించుచు; ముసురుకొనుచు=కవియుచు, క్రమ్ముచు; అసదృశగతి= అసమానగమనము;

45, 67—ఈపద్యార్థము స. భా. లో లేదు. "ఉదంకుండును వానితోడన తగిలి యవ్వివరంబున నాగలోకంబునకు నరిగి" అనియున్నది అతలమునుండి యె ట్లుదంకుఁడు నాగలోకమునకుఁ బోఁగలిగెనో తెలుప లేదు. తక్షకుఁడు చొచ్చిపోయినకన్నము సన్నముగా నున్నది గావునఁ జానం బోలేక ఉదంకుఁడు దానిని గోలతోఁ ద్రవ్వ మొదలు పెట్టె. సాధ్యముగాక విచారించుచుండగా నింద్రుఁడు వజ్రాయుధమును బుచ్చె ననియు నది వచ్చి త్రవ్వఁగోలలోఁ జొచ్చె ననియు దాన నరంధ్రము నిడు పుబిలముఁ ద్రవ్వఁగలిగి నాకలోకమున కరిగె ననియు నున్నది. స. భా. లో లేకపోవుట యేమికారణమో? పలవ్రుచు=పలవించుచు; దుఃఖించుచు; తలఁచుడు=ఏర్పడు; 45, 69—నాగలోక మనఁ బాతాళ మనియు నది యెక్కడనో భూమిక్రింద నుండుననియుఁ జెప్పుకొనుచుందుము. "అనేక

విశత్ప్రాపాద హార్మ్య వలభీనిర్వ్యూహాశతనంకుల ముచ్ఛావచక్రీడాశ్చర్య నానాశకీర్ణ మవశ్య గ్నాగలోకం" అని యుండుటంజేసి అది యమేరికా వంటియొకఖండ మనియు నందు నానావిధపురారణ్యనదీనదాదులు కల వనియు దెలియుచున్నది. ఈవర్ణనము న. భా. లో. లేదు. బారు= వరుస; మాడుగుల = మేడలలో భేదము, మిద్దెయిండ్లు; తీరు=చక్కదనము; దివంబు రాయు పైగోడలసౌరు=ఆకాశము నొరయు మిద్దెగోడల యందము; కొరు=వర్ణాధిక్యము; (గోపురము లనేకము లగుటంగుల పెంపుతో నున్నవని యర్థము) వనాళిపేరు = వనసమూహములకీర్తి; వళ్ళజోరు=నదులజలము; తనర్చె=అతిశయింపఁజేసె; ఇందు వృత్త్యను ప్రాసి మలంకారము. 71—ఇక్కడ నాగస్తుతి భిన్నదేశప్రతులందు భిన్నభిన్నముగా నున్నది. యేది సరియైనపాఠమో తెలియసాధ్యముకాదు.

46, 78—ఆగ్నేయయంత్రసాహాయ్యంబునఁ జక్రయంత్రము తిరుగుచుండ వస్త్రములు నేయునాచారము మనకుఁ దొల్లింటినుండియుఁ గలదని దీనం దెలియుచున్నది. 81—మున్నూటయఱువది యరము లన 360 దినము లనియు, ఇర్వదినాల్గుపర్వములు =పక్షము లనియు, చక్రము=సంవత్సరపరిమితకాల మనియు, ఆర్వురు కొమాళ్ళు=ఋతువు లనియు, కన్నెబిడ్డలు చిన్మాయాశక్తు లగుధాతవిధాత లనియు, సితాసితతంతువులు=పవలురేలనియు, నెఱుంగునది. బడుగు=సంసారాత్మ కపటంబు; 82—ఉదంకుఁడుస్తుతించినయీపద్యార్థము న. భా. లో లేదు. 83—దివ్యపురుషుఁడు హయాపానంబునం దూఁదు మనినట్లు మూలమున నున్నది. దానికి భిన్నముగా న. భా. లో నపాన మనఁ దప్పనికాఁబోలు, "అశ్వకర్ణధ్మానంబు నేయు" మని యున్నది. "ఏత శ్యమపానే ధమస్వ" అను మూలార్థము విచారింతము. అపానము=గుద స్థానము; గుదస్థానమున సర్వనాడులకు మూలాధారమైనచక్రము గలదు. అట నూదినప్పుడే సర్వస్రోతోమార్గములనుండియు ధూమశిఖలు బయలుదేరి వ్యాపించుటకుఁ గారణ మగును. ఇదియుంగాక తొల్లిదేవతలలో

గలహించి యగ్నిహోత్రుఁ డశ్వరూపమునంది పాఱిపోయెను. అప్పుడు వేల్పులు వాని వెన్నంటి ప్రార్థింపఁగా నశ్వము మూడినుండి బయలువెడలి వారి ననుగ్రహించె ననియు ఋగ్వేదము చెప్పుచున్నది. దీనికి వేదభాష్యములో విద్యారణ్యులవారు చక్కఁగా వ్యాఖ్యానము చేసియున్నారు. చిత్తగింపుఁడు. ఈకారణంబున నవానంబున ధమనము చేయుమనియె వ్యాసభగవానుఁడు; కర్ణమున నాడఁ లుంగిడుటను లేవు. అట నూదుమనుట సరియైనది కాదని తెలియుం. ఎవరో యిట్లు మార్చియున్నారు.

48లో 95, 96, 97—ఈమూడుపద్యములు మూలమున లేనివే "ఉదంకః క్రుద్ధ స్తక్షకం ప్రతి చిక్రీర్షమాణః ప్రతిస్తే" ఇంతమాత్రమున్నది. దానికి విలాసముగా వ్రాయఁబడినది. 98—ఉదంకుఁడు జనమేజయునకు సర్పయాగబుద్ధి పుట్టించుటకుఁ బోయినప్పుడు చెప్పినమాటలు మూలములో నున్నవిధము—ఉదంకుఁడు రాజుంజూచి "నీవుభారతాన్వయభూషణుఁడవు. నేను నీబాల్య మిత్రుఁడను. నీవిపుడు చేయఁదగిన కార్య మొక్కఁడున్న దనరాజు "నావలన నేమికార్యము కావలయు నెఱింగింపు" అనిన నుదంకుండు "నీతండ్రిగొప్పవాఁడు. అతిశాంతుఁ డట్టివానిని దక్షకుండు కఱచిచంపె. జగత్తున కపకారము చేసె. వానినుపేక్షింపఁ దగదు" అని మున్ను రాజుకార్యముచెప్పి పిమ్మట తన కార్యము చెప్పువాఁడై "గురుహితకార్యమున్ సలుపు నాకపకారము చేసినాఁడు. అతనిం జంపుట లోకహితము నీ వురగాధ్వరము చేయు" మనిరాజునకు నచ్చునట్లు చెప్పి బోధించినాఁడు. న. భా. లో "నేను గురుకార్యముచేయుచుండఁ దక్షకుఁడు నా కపకారముచేసినాఁడు" అని తనవిషయము ప్రధానముచేసి చెప్పి పిమ్మటఁ బరీక్షిత్తుమృతిం జెప్పినాఁడు. ఇట్లు చెప్పుట మూలభిన్నమే కాక లోకజ్ఞత కించుకలోపమేమో యని తలంపవలసియున్నది.